సంపుటము 4] జన్యువరి, 1918 [సంచిక 7

# బాలమిత్ర

## "ఆకాశము విరిగి తోకపై బడినది"

అనంగనంగ ఒక యూరు. ఆ యూరిలో నొక కాపు గలడు. వాని యింట్లో కోళ్లు, బాతులు, టర్కీకోళ్లు గలవు. ఆ కోళ్లలో నొకటి పిల్లలకోడి. దానిపిల్లలలో నొకటి పొట్టిది. తక్కినవన్నియు దానిని "పొట్టిగూన" యని పిలుతురు.

ఒకనాడీ పొట్టిగూన తల్లిదగ్గరనుండి తప్పించుకొని పూలతోటలోకి పోయెను. అక్కడక్కడ తిరిగి పురుగుల నేరుకొనుచుండగా నొక ఎండుటాకు చెట్టుమీదనుంచి దాని తోకపై బడెను. అది పడగానే అది అదరిపడినది. ఆకాశము విరిగి తోకపై బడెనని తలంచినది. ఎగిరి యొకగంతువేసి తోట నాలుగుమూలలకు పరుగెత్తినది. ఆ పరుగెత్తునపు డొక పొట్టిబాతు దానిచూచి "ఎందుకమ్మా! అట్లు పరుగెత్తెదవు?" అని యడిగెను.

కోడిపిల్ల.—"ఎందుకా? ఆకాశము విరిగిపడినది."

బాతు.—"నీకెట్లు దెలియును?"



కోడిపిల్ల.—“అరే! నా కండ్లతో జూచితిని. చెవులతో వింటిని. నా తోకమీద బడినది.”

బాతు.—బలే ఆశ్చర్యపడి “అట్లయితే రాజుగారిదగ్గరకు బోయి చెప్పుదము పద” యనెను. సరేనని కోడిపిల్ల దోవతీసెను.

అవి రెండు బోవుచుండగా కోడిపెట్ట యొకటి వాటి కెదురుపడినది.

కోడి.—“ఎక్కడికి పోవడం. ఎందుకు?”

కోడిపిల్ల.—“ఎందుకా? ఆకాశము విరిగి పడినది.”

కోడి.—“ఎట్లు దెలియును?”

కోడిపిల్ల.—“ఎట్లనగా, నా కండ్లతో జూచితిని, ఈ చెవులతో వింటిని, ఈ నా తోకపై నది బడినది. అందుకని రాజుగారితో చెప్పుటకు బోవుచున్నాను.”

కోడి.—“నేనుగూడా వత్తునా?”

కోడిపిల్ల.—“ఓ! రావచ్చును” అనెను.

కోడిపిల్ల, కోడిపిల్లవెనుక బాతు, బాతువెనుక కోడిపెట్ట

గబగబ పోవుచుండెను. కొంచెముదూరము పోగానే గూసుబాతు ఎదురుపడెను.

గూసుబాతు.—“ఎక్కడి కెక్కడికి? పడుచు లేచుచు పోవుచున్నా రెందుకు?”

కోడిపిల్ల.—అయ్యో! నీకుతెలియదూ, ఆకాశము విరిగి పడినది.”

గూసుబాతు.—“ఏమిటీ! ఎప్పుడూ! ఎట్లు దెలియును?”

కోడిపిల్ల.—“తెలిసే దేమిటి? నేజూచితిని, నేవింటిని, నా తోకమీదనే బడినది. ఇంకేమి తెలియవలె రాజుగారిదగ్గరికి పోవుచున్నాము.”

గూసుబాతు.—గుండె లెగిరిపోయెను. “అబ్బా! అట్లానా, నేనుగూడా వత్తునా?”

కోడిపిల్ల.—“చక్కగా రావచ్చును. ఏ అభ్యంతరము లేదు.” అని దోవతీసెను.

కోడిపిల్ల, కోడిపిల్లవెనుక బాతు, బాతువెనుక పెట్ట, పెట్టవెనుక గూసుబాతు గబగబ పోవుచుండెను. ఇంకా కొంతదూరము పోవునప్పటికి టర్కీకోడి కనుపడెను.

టర్కీకోడి.—“ఓహోహో! బలే తమాషాగా ఉన్నదే. ఎక్కడికబ్బా! బుడింగు బుడింగున పోవుచున్నారు? ఎందుకిటుల పోయెదరు?”

కోడిపిల్ల.—“ఆకాశము విరిగిపడినదయ్యా.”

టర్కీకోడి.—"అదేమిటి? ఎట్లు దెలియును?"

కోడిపిల్ల.—"అదే తెలియదా? నా తలమీద బడగా, నేను చూచితిని, చెవులతో వింటిని, రాజునకు చెప్పబోవుచున్నాము."

టర్కీకోడి.—తమాషాగా నుండెను. "నేనుకూడా వచ్చెదను" అనెను.

కోడిపిల్ల.—"ఇష్టముంటే రావచ్చును, కష్టమైతే మానుకొనవచ్చును." ఇంత గొప్పసంగతిని విని ఎట్లు టర్కీకోడి పోకుండ యుండగలదు. గనుక, కోడిపిల్ల, కోడిపిల్లవెనుక బాతు, బాతువెనుక పెట్ట, పెట్టవెనుక గూసుబాతు, గూసుబాతువెనుక టర్కీకోడి గబగబ పోవుచుండెను. ఇట్లు పోవుచుండగా, నక్కబావ ఎదురువచ్చెను.

నక్క.—"బలేబలే! ఎక్కడికో అంతా పోవుచున్నారే! ఒకరివెనుక నొకరుచూడ తమాషాగా నున్నదే. ఎందుకు?"

కోడిపిల్ల.—"ఆకాశము విరిగిపడినది."

నక్క.—"ఎట్లు దెలియును?"

కోడిపిల్ల.—"నా తలమీదనే పడినది. నేనే వింటిని, నేనే చూచితిని."

నక్క.—"అయితే పోవడ మెక్కడికి?"

కోడిపిల్ల.—“ రాజుగారియొద్ద చెప్పుటకొరకు.”

నక్క.—“ రాజుగా రెక్కడ ఉన్నారు?”

కోడిపిల్ల.—“ నాకు తెలియదు.”

బాతు.—“ నాకు దెలియదు.”

కోడి.—“ నాకును తెలియదు.”

గూసుబాతు.—“ నాకుకూడా తెలియదే.”

టర్కీకోడి.—“ నాకసలే తెలియదు.”

నక్క.—“ నాకు దెలియును, రండి నావెంట.” అని ఒక కలుగులోకి దీసికొనిపోయెను. తరువాత ఏమిజరిగెనో ఎవరికిని దెలియదు.

---

# ప్రకృతి పాఠములు

## 41 వ-పాఠము

### జంతువులయొక్క మెదడు, నాడులు

(గతసంచిక శేషము)

ఇదివఱకు లోకమునందు జరిగెడు సంగతులును నీవెట్లు తెలిసికొందువో నేర్చుకొనియుంటివి. నీ మనసు నీ తల లోని మెదడునందున్నది. ఆ మనస్సు మెదడును, నాడుల నుపయోగించుకొని వాటిచే కబురులను సర్వదేహములోనికి




పంపుచున్నది. మెదడు, గొప్ప యంత్రశాలలోని ఇంజన్‌వంటి దనవచ్చును.

ప్రతి జంతువులోను నీకువలెనే మెదడును, నాడులను కలిగియున్నది. వానిద్వారా అవి తమచుట్టు జరుగుచుండు సంగతులను తెలిసికొనును. పుట్టినపుడు పిల్లి కూనకును, పసిపిల్లకు నే భేదములేదు, గాని కొన్ని దినములలో నది ఎన్నో సంగతులను తెలిసికొనును, గాని, ఆ దినములలోనే బిడ్డ అంత

నేర్చుకొనలేదు. తరువాత నీవెట్లు ఆయా సంగతులను చూచుట వలన వినుటవలన, తాకుటవలన నేర్చుకొందువో అదేరీతిని పిల్లియును నేర్చుకొనును, నీవెట్లు నీ కండరముల నుపయోగింతువో అదేలాగున అదియు నుపయోగించును.

ఈ విషయము అన్ని జీవరాసులలోను సత్యముగా నుండును. చిన్ని ఈగలు దోమలు సహితము తమకున్న చిన్న మనస్సు నుపయోగించును, నీవు కొట్టబోవు నప్పుడీగ యెంత త్వరగా తప్పించుకొనిపోవునో గుర్తించుము. అంత త్వరగా నది తప్పించుకొనునట్లు జేసినది దాని మనస్సే.

లోకములో ప్రతినిమిషము ఎంత ఆలోచన జరుగుచున్నది! ఆయా జంతు సంతానముల మనస్సులు ఎంత పని గలిగియున్నవి! ఒకసారి తోటలోనికిబోయి చూడుము. అక్కడేమేమి కనుబడునో పరికించుము. పిట్టలు, సీతాకోక చిలుకలు, తేనెటీగలు, ఈగలు, కప్పలు, గోదురుకప్పలు, చిన్నపురుగులు వేనవేలుగ కనుపడును, అవి తలంచకుండ కదలనే కదలబాలవు.

వాటిలో కొన్ని మరికొన్నిటికంటె ఎక్కువగా దలంచును, పక్షి పురుగుకంటె ఎక్కువగా దలంచును. కొన్ని ఇతరమైన వానికంటె త్వరగా తలంచును. ఒక పువ్వునుండి మరొక పువ్వునొద్దకు త్వరిత్వరితముగా నెగురు హమింగ్ పక్షి, బహు త్వరగా తలంచును, గాని గోదురుకప్ప చాల మందబుద్ధి గలది. దాని మనస్సంత ఎక్కువగా పనిజేయదు, గాని

ఎప్పుడో ఒకసారమాత్రము చురుకుదన మంతటిని జూపును. దాని దగ్గర కొకపురుగు వచ్చినయెడల నీవు చూచుచుండగనే, నీకు తెలియకుండనే మెరుపువంటి వేగముతో నా పురుగును తినివేయును.

జంతువులెంత ఎక్కువగా మెదడున్న అంత ఎక్కువగా దలంచును. మనుష్యుని కన్ని జంతువులకంటెను ఆలోచన ఎక్కువ, ఎందుకు? ఎక్కువ మెదడున్నందుననే. నత్తకు బహు కొద్ది గనుకనే అంత మందముగా నుండును. గుర్రములు, ఏనుగలు మొదలైనవాని మెదడుకన్న మనుష్యుని మెదడు కొద్దియేగాని శరీరముయొక్క పరిమాణమునుబట్టి జూచిన యెడల మనుష్యుని మెదడే గొప్ప. జంతువులెంత తలంచినను, అవి చేయలేని వెన్నోసంగతులు గలవు.

---

## అలాస్కా పిల్లలు

అలాస్కా ఉత్తర అమెరికా ఖండములో వాయువ్య దిక్కుగానుండు ఒక ద్వీపకల్పము. ద్వీపకల్పమనగా, మీలో చాలమందికి తెలియుననుకొనుచున్నాను. అది ప్రస్తుతము అమెరికాలోని యునైటెడ్ స్టేట్సువారిదై యున్నది. అక్కడ వారి జనాంగపు జెండా, చుక్కలు చారలుగలది ఆడు



చున్నది. ఈ దేశమెంతో సిరిసంపదలతో తులతూగుచున్న దట, గాని మిగుల చలిప్రదేశమం దుండుటచే నివాసయోగ్యముకాదు. అయినను అచ్చటనుండు జనులు లేకపోలేదు. ఆ దేశమునందు ఎత్తైన స్థంభములుకలవు, అవి వికారరూప ప్రతిమలతో కూడియున్నవి. అట్టివాటిలో ప్రతిది ఏదో ఒక కుటుంబములోగాని జాతిలోగాని, జరిగిన గొప్ప కార్యములను సూచించును. అవి ఆయాకుటుంబముల గురుతులై

యున్నవి. ఎలుగుబంటి, తిమింగిలము, కాకి, తోడేలు, గరుత్మంతుడు, మొదలగున వెన్నోరూపము లాస్తంభములపై జూడవచ్చును.

అచ్చట నున్నవారికి విద్యలేకుండెనుగాని క్రీస్తు నామమును నరులకు ప్రతిస్థలమున ఆయననుగూర్చి చెప్పుటకు కంకణము గట్టుకొనిన మిషనెరీలు అక్కడకునుబోయి పనిజేయుచు జనులకు నీతిసూర్యుని జూపుచున్నారు.

వీరు అక్కడ పాఠశాలలు స్థాపించి అక్కడ నున్నవారికి జీవ్యముయొక్క ముఖ్యోద్దేశమును జూపుచున్నారు. బోర్డింగులుపెట్టి, అనేకమంది బాలుర నచ్చటజేర్చి వారికి మంచి అలవాటుల నేర్పుచున్నారు. అట్టి పాఠశాలలలో ఉదయము ఆరుగంటలకే గంట కొట్టబడును. ఎండకాలమున ఆ దేశములో దినమంతటియందు చీకటి ఒక్కగంటమాత్రమే ఉండును. ఆ సంగతి నీకు తెలియునా? ఒక బాకానూదగానే అందరును నిద్రించవలెను. గంట కొట్టినప్పుడందరును లేచి తమ పనులను జేసికొనవలెను. మొదట ఈ దేశమునకు కోళ్లను తీసికొని పోయినప్పుడు చీకటి పగలులు వాటికిని నేర్పవలసి వచ్చెను.

అలాస్కావారిలో నొక ముఖ్య దురలవాటేదనగా, జాగుచేయుట. ఇది దాదాపు అనేకమందిలోగలదు. జాగుచేయుటనగా, నేడు చేయవలసినది వెంటనేచేయక రేపటివరకు

నిలిపియుంచుట, దీనియంత చెడ్డ దురభ్యాసము మరియొకటి లేదు. ప్రస్తుత మలాస్కా పిల్లలకు ప్రతిదియు "ఇప్పుడే చేయు"నట్లు నేర్పుచున్నారు. లేచుటకు వారికి మూడు నిమిషముల కాలముమాత్రమే ఇత్తురు. భోజనమునకు 20 నిమిషములకంటె ఎక్కువ లేదు. వారిలో కొందరది సిద్ధపరచుటకు 4½ గంటలకే లేవవలసియున్నది.

ఏడుగంటల 10 నిమిషములకు పనిగంట కొట్టబడును. వెంటనే ఒక పూటంతయు పనిజేయుట కేర్పరచబడినందున ప్రతివారును, ఆయాపనులకు బోదురు. వారట్లు బోవునది లేనిది జూచుటకు పైని అధికారులుగలరు. తక్కినపూట చదువుకొనుట కేర్పరచబడినది. అలాస్కావారు ఉపయోగకరమగు పనిముట్లను, సామానులను చేయుటకును, ఓడలు కట్టుటకును, వస్త్రములు నేయుటకును, కుట్టుటకును, అల్లికల నల్లుటకును, నేర్చుకొనుచున్నారు.

దినములో నొకసారి వారు ప్రార్థించుటకై గుడికి వెళ్లవలసియున్నారు. ప్రతిదియు సైన్యసంబంధపు క్రమశిక్షయందున్నది. అలాస్కావారి పడవ ఒక్కటే చెట్టుదుంగలో చక్కగా తొలువబడి తేలికైనదిగా నున్నది. అది ఎట్టి సముద్రములోనైనను చక్కగా పోగలదు. అయితే ప్రస్తుతము అలాస్కావారు, అమెరికావారిచే చేయబడు నావలను మోటారుబండ్లను నడుపుచు ఎక్కుచున్నారు. ఇది వారెంతగా

అభివృద్ధిలోకి వచ్చిరో తెలుపుచున్నది. వారి కిప్పు డవసరముగా కావలసినవి విద్యయు, చేతిపనులునై యున్నవి. ఈ లాగు చేయుటద్వారా అలాస్కావారు నాగరికతగల ప్రపంచములో సంబంధపడి గొప్పమేలునకు కారకులగుదురు.

---

## బైబిలు పిల్లలు

### సౌలు



బాలమిత్రులారా! ఇదివరకు సౌలు అను రాజునుగురించి కొంతవరకు చదివియుంటిమి. సౌలు చారిత్రమును సవిస్తరముగా తెలిసికొనవలెనన్న మొదటి సమూయేలు గ్రంథమును చదివిన తెలియును. అతడు తన తండ్రి గార్ధభ

ముల వెదుక వెళ్లినపుడు ప్రవక్తయైన సమూయేలు అతని తల మీద తైలముపోసి యెహోవా అతనిని ఇశ్రాయేలీయులకు రాజుగా నభిషేకించెనని తెలిపెను. పనులు జేయుటకు చిన్నతన మని యనుకొందురు. చదువరులారా! బైబిలునందు ఎందరినో ప్రభువు పనిచేయుచుండగానే పిలుచుకొని వారిచే మరిగొప్ప పనుల జేసినట్లు చదువుదుము. కాన మీ పనులను నమ్మకముగా జరిగించుకొనుడు. సౌలు రాజైన మొదటి సంవత్సరములో మంచివాడుగనే యుండి ప్రజల పాలించెను. సమూయేలు అర్పించవలసిన దహనబలులను సమాధానబలులను సౌలు అర్పించుటకు తెగించి అర్పించెను. ఇది రాజైన సౌలు చేయ గూడనిపని. అంత సమూయేలు సౌలును గద్దించి రాజ్యము అతని సంతానమునుండి ప్రభువు తొలగించెనని యాతనికి తెలియజేసెను. చూచితిరా! మనము కొంతసేపు తాళియుండక ఆత్రముచూపిన నెంత కీడుమూడునో! సౌలు 7 దినము లాగి తుదకు బలుల నర్పించినందులకు గదా అతని సంతానము సహితము పెక్కు వత్సరములు రాజ్యము నేలు ప్రాప్తిని తొలగించుకొనియె. త్వరపడి యేపనిని చేయవూన కుడు. ఒకప్పుడు యెహోవా సౌలును అమాలేకీయులను వారికి గల సమస్తమును నిర్మూలపరచుమని యానతిచ్చినపుడు సౌలు అమాలేకీయుల రాజునున్ను, వారియొక్క క్రొవ్విన పశువులను నిర్మూల పరచకపోయెను. అంత ప్రభువు సౌలును

రాజుగా జేసినందులకు పశ్చాత్తాప పడుచున్నానని సమూయేలుతో ననెను. ఎల్లప్పుడు మనము మనకు నియమించిన ప్రకారము చేయవలెను గాని పనికిమాలిన పెత్తనము గట్టుకొని నియమింపబడిన రీతిగా చేయకున్న ప్రభుని కోపమును మనకు మనమే మనపైకి రప్పించుకొందుము. ఇట్లు సౌలురాజు అవిధేయతగానే జీవించెను. చెడువారికి మంచివారన్న గిట్టకుండుట లోకమునన్నదే గదా! మంచివాడగు దావీదును అనేక విధములుగా చంపుటకు అనేక ప్రయత్నముల జేసెను. ఈ రాజు చరిత్ర చెడుతనము చేటునే రప్పించునని మనకు నేర్పుచున్నది. మంచివారమై బ్రతికిన కొద్దికాలము ప్రభువునందు విధేయతగను తోడిప్రజలందు ప్రేమగలిగియు మర్యాదగా జీవింతము.

సౌలు శకునకత్తెల శకునములను మొదట దేశములో లేకుండునట్లు జేసినను వారితో చివరకు సాంగత్యము గలిగించుకొని సమాధినందున్న సమూయేలును బయటకు రప్పించెను. ఇట్టి అవిధేయ క్రియలన్నిటినిబట్టి ప్రభుని కోపము తనపైని తన కుటుంబముపైని రప్పించుకొని తుదకు యుద్ధమునందు ఒక్కనాడే తాను తనకుమారుడగు యోనాతాను అపజయమొంది చంపబడిరి.

బాలమిత్రులారా! అవిధేయత అన్ని కీడులను కలిగించునని నేర్చుకొని అందరియెడల విధేయులై ప్రవర్తింపుడు.

# బాలమిత్ర టపా

ప్రియ బాలమిత్రులారా!

చాలకాలమునుండి ఈ బాలమిత్ర నెలకొకటిచొప్పున మా బడిలో ఇచ్చుచుండేవారు. దానిని చదువుచున్నందువల్ల నేనుకూడా ఒక ఉత్తరము వ్రాయవలెనని ఆశించితిని. మా శ్రీకాకుళములో 1909వ సంవత్సరములో ఆర్చిబొల్డు మిశమ్మ గారు ఒక బాలికా పాఠశాలను స్థాపించినారు. నేను 1911వ సంవత్సరములో నీ పాఠశాలయందు అక్షర తరగతిలో ప్రవేశించితిని. ఇప్పుడు మా బడిలో 67 గురము బాలికలము చదువుచున్నాము. ఇందులో 2 మాత్రము క్రైస్తవ బాలికలున్నారు. ముగ్గురు క్రైస్తవ టీచర్లున్నారు. ప్రతిదినము ఉదయమున కీర్తనలుపాడి ప్రార్థనతో బడి ఆరంభించుచున్నాము. ఆదివారము సబ్బాతుబడి జరిగించుట మాత్రమే గాక ప్రతి దినమును బైబిల్ చెప్పుచున్నారు. ఇప్పుడు నేను 4 వ తరగతిలో చదువుచున్నాను. ఈ పాఠశాలలో చదువుటవల్ల విద్య నేర్చుకొనుట మాత్రమే గాక దేవుని గూర్చియు నీతిని గూర్చియు కూడా నేర్చుకొనుచున్నాను. మా పంతులమ్మలు కుట్టు, కోలాటము, మంచిపాటలు నేర్పుచున్నారు. మాకు క్రిస్మసుకు బహుమతులిచ్చెదరు. ఇదివరలో రెండు సంవత్స

పములు మా హెడ్మాస్టరుగారు యుద్ధనాటకములు నేర్పి అట్టి సభలలో మాచేత చేయించిరి. దానిని చూచినవారు చాల మంది సంతోషించిరి. ఆ నాటకమును 2 భాగములుగ అచ్చు కూడ వేయించిరి. చాలకాలమునుండి మా మేనేజరుగారగు ఆర్చిబాల్డు మిశమ్మగారు వేరే స్థలమునకు వెళ్లిపోవుట మాత్రమే గాక మా హెడ్మాస్టరుగారును ఈ పనిమాని వేరే పనికి వెళ్లిపోయిరి. గాని దేవుని కృపవల్ల మమ్మెక్కువగా ప్రేమించు మా ఆర్చిబాల్డు మిశమ్మగారును మా హెడ్మాస్టరుగారునువచ్చి ఈ బడి అభివృద్ధినిగూర్చి ప్రయాసపడుచు పనిచేయు చున్నారు. చాల సంతోషించుచున్నాము. ఈ క్రిస్మసుకు కూడ మంచి బహుమతులు దొరుకుననియును మంచినాటకము నేర్పుదురనియును ఆశించుచున్నాము. దేవుడు ఈ బడిని మంచి అభివృద్ధిలోనికి తెచ్చునట్లును మావంటి బాలికలనేకులకు మేలు గలుగునట్లును ప్రార్థించ వేడుచున్నాను.

ఇట్లు

కోలా జగమ్మ

నాల్గవ తరగతి

శ్రీకాకుళం, గంజాంజిల్లా

---

C. L. S. PRESS, MADRAS—1918